593/3715




# బ్రహ్మజ్ఞానదీపిక.

బెహారా రామమూర్తి కవి.

1783/8306

అబ్జర్వేటరి ప్రెస్సు, విశాఖపట్టణము.

1915.

# బ్రహ్మజ్ఞానము

[illegible]కలకత్తా బ్రహ్మసమాజమువా[illegible]

హిందూశాస్త్రమహాసభ[illegible]

మహారాజశ్రీ శ్రీమహారాజా

సర్ శ్రీగోడేనారాయణగజపతి రాయనింగారు

కే. సీ. ఐ. ఈ. వారి అనుజ్ఞాప్రకారము

శ్రీమాన్ శ్రీమహామహోపాధ్యాయ

శ్రీపరవస్తు వేంకటరంగాచార్యులయ్యవారలుంగారు

అనేకోపనిషత్తులనుండియు ధర్మశాస్త్రములనుండియు

ఎత్తివ్రాసిన శ్లోకములకు తర్జుమా.

పద్యరూపముగా నెల్లరకు సులభముగా దెలియునట్టుల

లాంగలనదీతీరస్థ బొంతలకోడూరు నిలయుడును

[illegible] రామకృష్ణసూరిపుత్రుడును అగు

రామమూర్తి కవిచే

రచియింపబడి, అబ్జర్వేటరిప్రెస్సులో ముద్రింపబడెను.

1915.

OFFICE OF THE
M

| ...ములు. | | | శ్లోకముల అర్థములు. | | |
|---|---|---|---|---|---|
| | | | ఆరంభము | అంతము | మొత్తము |
| | ...డకోపనిషత్. | ... | 1 | 6 | 6 |
| | ఈశోపనిషత్. | ... | 7 | 9 | 3 |
| | తలవకారోపనిషత్. | ... | 10 | 13 | 4 |
| 4 | కఠోపనిషత్. | ... | 14 | 21 | 8 |
| 5 | శ్వేతాశ్వతరోపనిషత్. | ... | 22 | 26 | 5 |
| 6 | బృహదారణ్యకోపనిషత్. | ... | 27 | 28 | 2 |
| 7 | మహాభారతము. | ... | 29 | 43 | 15 |
| 8 | మహానిర్వాణతంత్రమ్. | ... | 44 | 53 | 10 |
| 9 | శ్రీమద్భాగవతము. | ... | 54 | 56 | 3 |
| 10 | మనుధర్మశాస్త్రము. | ... | 57 | 65 | 9 |
| 11 | యోగవాశిష్ఠము. | ... | 66 | 70 | 5 |
| 12 | ఇతరగ్రంథములు. | ... | 71 | 80 | 10 |
| | | | | | 80 |

ఛత్రపురము. }
5-3-1912. }

బుధవిధేయుడు.

బెహరా రామమూర్తి.



శ్రీరస్తు.

# బ్రహ్మజ్ఞానదీపిక.

తే॥గీ॥ ఏమహావిద్యచే నీశు డెరుగబడునో।
యదియె శ్రేష్ఠంబటంచును ననగవలదె।
వేదములుశిక్షకల్పంబు వేనవేలు।
విద్యలవియెల్ల కొఱగాని విద్యలనఘ॥ ౧॥

సీ॥ ఎంచగానెయ్యది యెలమిజ్ఞానేంద్రియ।
ములకునవిషయమై వెలుగుచుండు।
కర్మేంద్రియంబుల గ్రహణంబెఱుంగదో।
యాదిమూలములేక యలరుచుండు।
శ్రోత్రనేత్రంబులు సూటిగాలేనిది।
హస్తపాదంబులు నరయజన్మ।
నాశముల్లేనిది వాసిప్రదేశని।
బంధనలేనిదు బరగిసకల।

ఆ॥గీ॥ మనసుగల్గిసూక్ష్మమును బ్రాణమునులేక।
సర్వభూతములకు సరగ కార।
ణంబునైనయట్టి యాపరబ్రహ్మము।
జగతినిండునట్టి చతురగుణుఁడు॥ ౨॥

తే॥గీ॥ ఈపరబ్రహ్మమునఁబ్రాణ మింక మనసు।
నింద్రియంబులు భూమియు నిరవుజేసి।
పంచభూతంబులనెడి ప్రపంచమిందు।
గల్గెననిబల్కుదురుగాదె ఘనులుదెలియ॥ ౩॥

తే॥గీ॥ అఖిలభూతంబులంగూడి యలరువాఁడు।
వాఁడెపరమాత్మయనియెంచు వారెఘనులు।
క్రీడపేర్మి యుపరమాత్మ జాడనిల్పి।
కర్మశీలురునగువారు ఘనులుసుండి॥ ౪॥

కం॥ సత్యమెజయమగు ధరణిన।
సత్యంబపజయమటంచు చాటనెశ్రుతులుఁ।
నిత్యంబైనదిసత్యము।
సత్యమెదుర్దశలకెల్ల స్థానముసుండీ॥ ౫॥

కం॥ కన్నుల నఖిలేంద్రియములు।
జన్మములంజపమునలసచాలరెయుగగా।

నెన్నఁగఁబరమాత్మునుమరి।
పన్నఁగఁపరిశుద్ధచిత్తపదవినిదక్కన్॥ ౬॥

కం॥ ధరఁగల్గువస్తుజాలము।
పరమేశ్వరుచే జనింపబడెఁగావుననని।
ధ్ధరవిషయాసక్తినిబోʼ।
దరుముచు నానందపదవి దగనొందవలెన్॥ ౭

తే॥గీ॥ మొదలుచూడదు మొదలుసమీపమునను।
దూరమున పైనిలోపల దొలఁగకుండ।
నన్నిటనునిండియాయాత్మ యున్నదనుచు।
దెలియువారలుధీరులు దివ్యగుణులు॥ ౮॥

సీ॥ అవయవహీనుండు నరయనకాయుండు।
స్నాయుహీనుడుపాపనాశనుండు।
నిర్మలుండునుసర్వని యతిగోచరుడును।
మనసుననియమించి మను నువాఁడు।
ఆత్మనుపరిశుద్ధు డనయముస్వప్రకా।
శుఁడు వస్తుజాలముసొంపుమీర।
నిర్మించియున్నిటనెనయబై వాడయి।
వ్యాపకుండగుచు సర్వమున నిండు॥

తే॥గీ॥ నట్టిపరమాత్మునే ధీరుడరశిగనునొ।
వాడెపుణ్యుడు ఘనుడును వాడెగుణుడు।
వాడెచతురుడు వేదాంతివాడెధర్మ్మి।
డనుచు పెద్దలుదెలుపంగ వినమెజగతి॥ ౯॥

కం॥ వాక్కున నెయ్యది వెల్లదొ।
వాక్కునునది దేనివలన।
వరలుచునుండున్।
నిక్కముగనదియె బ్రహ్మము।
తక్కినలోకులుపశించు।
తపములుం జెపముల్॥ ౧౦॥

తే॥గీ॥ ఇంచుకయు దేనిమనసుచే నెరుగడెవ్వ।
డెప్పుడును దేనిచే మనస్సెరుగబడునొ।
యద్దిబ్రహ్మంబటంచును ననగవలయు।
గానిలోకులు గన్నదిగాదుసుండి॥ ౧౧॥

కం॥ ఎరుగుదు నెరుగను బ్రహ్మం।
బరుదుగనని దెల్పజాల।
నరయగ బ్రహ్మం।
బెరుగను నెరుగుదుననునీ।

వరవాక్యరహస్యము౦దె।
వర్తిలుచు౦డు౯॥ ౧౨॥

క౦॥ మముబ్రహ్మ౦బునిరాకర।
ణముచేయకను౦డుగాత।
నయమున నెపుడు౯।
తమిమీర పరబ్రహ్మము।
క్రమమునను వశి౦పగడగు।
కతముననుభువి౯॥ ౧౩॥

తే॥గీ॥ క్షుత్పిపాసలు లేకయుశోకనాశ।
మగుచుజావుపుట్టులు లేకయచ్చముగను।
ను౦డుస్వర్గ౦బు నాన౦దమ౦డల౦బు।
పాడుమృత్యువయచటనీభయమదేల॥ ౧౪॥

తే॥గీ॥ ప్రియహితద్వితయము స౦భవి౦చునపుడు।
ధీరుడగువాడు హితమును దీసికొనుచు।
మ౦దబుద్ధి ప్రియ౦బును మదినిగోరు।
క్షేమలాభ౦బులనుగోరు చనటియగుట॥ ౧౫॥

తే॥గీ॥ వేదపారాయణ౦బున లేదుబహువి।
దార్థధారణశక్తిని నరయలేదు॥

శ్రవణమునలేదుపరమాత్మ భువినిదెలియ।
నాత్మరూపంబుగనువాఁడె యాత్మదెలియుఁ౧౬॥

తే॥గీ॥ ఎవఁడుదుష్కర్మముసుడుగఁ డింద్రియముల।
చలనశాంతినిజెందఁడియ్యలనుచిత్త।
సుస్థిరతలేకకోరిక సొలసిశాంతి।
నొందఁడవ్వాఁడు పరమాత్మ జెందలేఁడు॥ ౧౭॥

తే॥గీ॥ వెలయనజ్ఞానమనునిద్ర దొలఁగద్రోచి।
జ్ఞానమను తెల్విలోనార్య జనులఁజేరి।
యంటరానట్టిక్షురధార యట్టితీక్ష్ణ।
మైనపరమాత్మగన్గొని మనుఁడుధరణి॥ ౧౮॥

తే॥గీ॥ ధీరులమృతులగుచుసం సారమందు।
నిత్యవస్తువుగోరరు నెమ్మితోడ।
నల్పబుద్ధులువిషయమం దాసగల్గి।
శ్రమముపడుదురుమృత్యుపా శమునఁజిక్కి॥౧౯॥

తే॥గీ॥ ధరణిజీవులునిద్రించు తరుణమందు।
నూరకుండకసకల ప్రయోజనోప।
యుక్తసామగ్రినిర్మాణ శక్తుఁడగుచు।
నలరునాతనిబ్రహ్మంబు। నమృతమంద్రు॥ ౨౦॥

సీ॥ ప్రాణస్వరూపమౌ పరమాత్మఁడగునతఁ
డానంబుగానుండ జగముదోఁచు।
నదికునిశాయుధంబని భయకంపితు
లగువారలుండు దురమృతపదవి।
భయహేతువుననగ్ని ప్రజ్వరిల్లుచునుండు।
భయమునసూర్యుండు ప్రభలనొసగు।
జలదముల్ భయమున జలమునొసంగును।
భయమునవాయువు బరగుచుండు।
గీ॥ భయమునను మృత్యుదేవత బారుచుండు।
వానినేత్రింబులనుమనో వాక్యములను।
గననశక్యంబు బ్రహ్మంబు గలదటంచు।
నెరుకగలవారలకుదక్క నొరులకగునె॥ ౧౦॥
ఆ॥గీ॥ సర్వమునకునేఁ స్వప్రకాశుడనంతు।
డమలుడీశుడనగ నలరుచతడు।
శాంతినిచ్చుకొరకు సదమలధర్మంబు।
నడపువాడునేత పుడమిలోన॥ ౧౧॥
కం॥ సర్వాత్మగుణాభాసుడు।
సర్వేంద్రియవర్జితుండు సర్వేశ్వరుడు।

సర్వశరణ్యుఁడుదలపగ।
సర్వముపరమాత్మయనుచు।
చాటఁగవలయుఁ॥ ౨౩॥

తే॥గీ॥ పాణిపాదంబులునులేక పట్టునడచు।
వీనులునునేత్రములులేక వినునుజూచు।
నతఁడుసర్వజ్ఞుఁడాతని నరయరెవ్వ।
రాతఁడాదిమపూరుషుం డనగవలదె॥ ౨౪॥

తే॥గీ॥ అద్వితీయుఁడునై వర్ణమదియులేక।
బహువిధంబులశక్తులు పజలకొఱకు।
జేసియునుజగదాద్యంత వాసియగుచు।
నుండుదేవుఁడుశుభముల నొసగుగాత॥ ౨౫॥

తే॥గీ॥ ఈశులకునెల్లబరమేశుఁ డింక దేవ।
వరులలోనెల్ల పరమదైవంబునుండు।
పతులకెల్లను పతిమాకు బ్రాపెవండొ।
వానిధ్యానించి పాపముల్ బాపుకొనరె॥ ౨౬

ఆ॥గీ॥ సుతునికంటెపేర్మి చూడగానెయ్యది।
ధనముకంటెపేర్మి ధరణినెద్ది।
సర్వమునకులోన సంధించెనెయ్యది।

యదియెయాత్మయగుట నరయవలయు॥ ౧౭॥

సీ॥ ధనముచేనిండినధరణినైననను।
నాశ మొందక యుంచనాతరంబె।
ధనముచేనమృతత్వమనునది కాబోదు।
గల్గనిదానికి కాంక్ష లేల।
సత్యహీనుడననుసత్యునిగా జేయు।
వెలుగిచ్చిచీకటి వెడలజేయు।
వడిమిత్తివాతనుబడిపోలియకనుండ।
నమృతత్వము నొసంగియమరబోవు।

గీ॥ పరమపూరుష దేవశుభప్రభావ।
ఆదిమధ్యాంతరహితుడవైననిన్ను।
కోరిభజియింతు బ్రోవవే కూర్మితోడ।
సత్యమును దెల్పియు నొసంగిశాశ్వతంబు॥ ౧౮॥

కం॥ తనుఛేదింపగవచ్చిన।
జనునకునీడనిడుతరువు చందంబునభూ।
జనసదనమునకుశత్రులు।
జనగానాతిథ్యమురయ జరుపగవలయున్॥ ౧౯॥

కం॥ సమ్యజ్ఞానము హితమగు।

సత్యము శ్రేయస్కరంబు సత్యవ్రతముగ।
నిత్యముపక్షమవ్రతమది।
ఆత్మజ్ఞానంబుపరమ మగుననిన్నింటగ॥ ౩౦॥

తే॥గీ॥ ఏదిమేలనితలోచునో యెలమినందె।
తనదుయాత్మనిమోగింప దగునుసుండి।
పాపకృత్యంబుజేసిన వానికిప్రతి।
పాపమునుశేయమియుసాధువగుటమేలు ॥౩౧॥

సీ॥ అలసినవానికి నాసనంబిడుటయు।
శయనంబురోగికి సరగనిడుట।
ఆకలిగొనువానికన్నంబునొసగుట।
దప్పిగలానికి తత్క్షణంబు।
జలమొసంగుటయునుజరుపగవలయును।
వాక్క్రియామనములవలనపాప।
ములనుగావించరోముఖ్యముగానట్టి।
వారెతపస్వులు వారెకృతులు।
గీ॥ గానియడవులదిమ్మరి గాలినెండ।
గరముబాధలబడుచును గాయశోష।
ణమునొనర్చినమాత్రాన నమలతపము।

గాదటంచునుభారతకథలవినరె॥ 32॥

తే॥గీ॥ మూఢజనమైత్రి మోహంబుమూడజేయు।
సజ్జనులమైత్రిధర్మంబు సంగ్రహించు।
ధనమునన్యాయముగదెచ్చి దానధర్మ।
ములనుజేసినపాపముల్ దొలగలేవు॥ 33॥

తే॥గీ॥ ప్రాజ్ఞుడగువాడులోకుల పల్కులువిని।
హితములగువాక్యములదనమతినినిల్పు।
నీరముననుండుక్షీరంబు నేర్పుతోడ।
సంగ్రహించుమరాళంబు సరణిజగతి॥ 34॥

కం॥ సత్యముసరియగు ధర్మము।
సత్యంబునకంటెగొప్ప సరకిలగలదే।
సత్యవిహీనతకంటెన।
నిత్యంబౌకూరవస్తు నిచయముగలదే॥ 35॥

కం॥ జలనిధికియానపాత్రియు।
వలెమోక్షుడమౌననంత పదవికిసత్యం।
బిలనొకటియెసోపానము।
సలలితముగనొండులేదు చర్చింపంగ॥ 36॥

ఆ॥గీ॥ సత్యమునజయింపు సరగమోసంబున।

క్రోధమునను గెల్వు క్రోధచయము।
సాధుమార్గమునన సాధులనుపకార।
మునను గెల్వుత్తుదరి జనులనిలను॥ 32॥

తే॥గీ॥ తాల్మిదోషంబు నెన్నదు తగుధనంబు।
భువిన శక్తులకున్నుగుణ భూషణంబు।
శక్తికివశీకరణమగు సకలజగము।
తాల్మియనునాయుధముసర్వతంత్రహారిము॥

ఆ॥గీ॥ తనదులక్షణముల తాగనునెవ్వడు।
వాడెమునియటండ్రు వసుధలోన।
మానమునుధరించి మరివనవాసియా।
వాడుమునియటాచు వలదుబల్క॥ 39॥

ఆ॥గీ॥ ముదిమియందుసుఖము। మూడునెద్దానిచే।
దానివయసునందె బూనిజేయు।
మరయజీవనంబు నంతయుపరలోక।
సుఖముకొరకొనర్పు ప్రకటమతిని॥ 40॥

కం॥సత్యంబనునదెబ్రహ్మము।
సత్యంబనునదియెతపము సత్యమెక్రతువు।
సత్యమెశాస్త్రముదలపగ।

సత్యమునాశంబులేని సరకనివినరా॥ ౪౧॥

సీ॥ ధర్మము చేయంగ దగుకాల మిదియని।
నిర్ణయింపంగనేనికివశంబు।
మనుజునిరీక్షించి మానునేమృత్యువు।
నిత్యము వెంటాడి నెరయుచుండు।
సతతము ధర్మముసల్పుటయేమేలు।
సతము మృత్యువునోట జనములుంట।
ననఘులు విషయమధ్యము నందునుండియు।
నుండకచరియింతు రుర్విలోన।

గీ॥ దుర్మతుల్ విషయములను దొలగకుండ।
నున్నరీతినివిహరించి యుండలేక।
దుష్టవిషయంబులంబడి దుష్టులగుచు।
ధరణిచరియింతురందురు తత్వవిదులు॥ ౪౨॥

తే॥గీ॥ సుఖముదుఃఖంబు పేర్మియు సూటితోడ।
నప్రియంబును బ్రాప్తించు నపుడుజనులు।
తాననుభవింపనపరాకతంపుచిత్తు।
లగుచునుండుటవిధికదా యనఘులార॥ ౪౩॥

తే॥గీ॥ ఈగృహస్థాశ్రమంబున నెనయువాడు।

బ్రహ్మనిష్ఠాగరిష్ఠుఁడై బ్రబలితత్వ।
వేదిపరుఁడౌచుఁ దాఁ జేయువేలబనులు।
బరగనర్పణజేయుచు బ్రహ్మమునకు॥ ౪౪॥

కం॥ దురమందెవ్వఁడు బెదరఁడొ।
దురమందెవ్వాఁడు వెనుక దోఁగఁడొ మరియున్।
ధరధర్మపుసమరంబున।
మరణించినవాఁడులోకమంతయు గెల్చున్॥ ౪౫॥

తే॥గీ॥ కామమునుక్రోధమేరికి గలుగువశిత।
దీనజనులందుదయగల ధీరులెవరొ।
సత్యమెవ్వరికిలలోన సద్వ్రతంబొ।
వారెలోకంబులను గెల్చు వారుసుండీ॥ ౪౬॥

కం॥ తనకీర్తి పౌరుషంబులు।
జనులకు నుపకారమొందు సల్పెడునదియున్।
జనుఁడెవఁడుబైటవేయఁడొ।
ఘనుఁడాతఁడె ధార్మికుండు గణుతింపంగన్॥ ౪౭॥

కం॥ ఇలలో గృహస్థుఁడనిశము।
తలిదండ్రులె దైవమనుచుఁ దలపగవలయున్।
సలలితమతియైవారిని।

తలగక సేవింపవలయు తత్పరుడగుచున్॥ ౪౮॥

కం॥ కులపావనుడగుపుత్రుడు।
తలిదండ్రులమృదులవాక్య తతిచేదనుచున్।
జలమూనక కూరిమిబను।
లిలజేయుచునాజ్ఞలందు నేర్పడియుండున్॥ ౪౯॥

కం॥ ధనమునవస్త్రమునను మరి।
నెనరున సంతోషపరచు నెలతననిశమున్।
ఘనుడైన మానవుండిల।
జనదప్రియమార్గములను సతియెడదలపన్ ౫౦॥

తే॥గీ॥ ఘనపతివ్రతయగుకాంత కాంతునెడల।
క్రూరదృష్టినిజూడంగ గూడదండ్రు।
మనసులోనైనన ప్రియ మనగవలదు।
చెడుగుమాటలనెన్నడు నుడువతగదు ౫౧॥

ఆ॥గీ॥ కన్యకలకువిద్యగరపి యూదటధన।
రత్నవస్తుసమితి రహినొసంగి।
పండితుండునైన భవ్యుడౌవరునకు।
గన్యధారపోయు ఘనుడెజనుడు॥ ౫౨॥

కం॥ పతులయెడ మెలగురీతులు।

సతతమునెరుగుచునధర్మ శాసనవిధులున్।
సుతలకెరుకపడు వరకిల।
కుతుకముతో బెండ్లిచేయ కూడదుజనకుల్ ॥౫౩॥

తే॥గీ॥ ముక్తిమార్గంబు జూపునీ భక్తివిడచి।
జ్ఞానమునుగోరుమూఢుల సరణిదలప।
ధాన్యమున్మానియుముకను దంచువారి।
పగిదిదుఃఖంబులకుపాలు బడరె దేవ॥ ౫౪॥

తే॥గీ॥ తానునోరుడనుభేదమా తలపులేక।
సర్వభూతంబులందును సమతగాంచు।
శాంతచిత్తుడునగువాడు శాశ్వతంబు।
భక్తిపరుడగు భవ్యుడౌ భాగవతుడు॥ ౫౫॥

ఆ॥గీ॥ అధికమైనగాని యణుమాత్రమైనను।
నేర్పుతోడజనులు నేర్చవలయు।
సకలనీతిశాస్త్ర సారంబుదలపగ।
ప్రసవరసముగోలు భ్రమరరీతి॥ ౫౬॥

తే॥గీ॥ ఇంద్రియంబులలోనొక్క యింద్రియంబు।
స్ఖలనమును జెందుచోవాని తెలివియెల్ల।
భ్రంశమగునది నిక్కము భస్త్రిలోన।

తూటు గల్గిన జలమంత తొలగునట్లు॥ ౫౭॥

కం॥ పరవశము దుఃఖకారణ।
మరయంగానాత్మవశము నగుసుఖకరముఌ।
ధరలో సుఖదుఃఖంబుల।
గురుతులు సంక్షేపమునకు గుణలక్షణముల్॥

తే॥గీ॥ పుట్టుటయు గిట్టుటయు నొందు పొందు లేక।
పాపపుణ్య ఫలంబుల బడయు నొందు।
మేళనం బెద్దియును లేక మెలగుచుండు,
ప్రాణియనుదాని కింకొక ప్రాపు లేదు॥ ౫౯॥

కం॥ ప్రతిదినము నిర్జనంబౌ।
క్షితియందు ప్రవేశమగుచు చింతించునెడఌ।
హితమగుకోరిక లన్నియు।
సతముగసముకూడునం ద్రుసర్వజ్ఞులిలఌ॥ ౬౦॥

సీ॥ ధర్మంబు తాలిమి తగ మనోనిగ్రహ।
మును చౌర్యహీనతయును శుచితయు।
నింద్రియనిగ్రహ మిద్ధవివేకము।
సదమలవిద్యయు సత్యవచన।
మాగ్రహహీనత యనియెడునీపది।

ధర్మలక్షణములై తనరుచుండు।
దానము చేయుట తక్కువమైవను।
విస్తారమైనను వినుము దాని।

గీ॥ ఫలము దానంబుగొనువానిబట్టి కలుగు।
పాత్రతాపాత్ర తలెరిగి పరగ భువిని।
దానమొసగును సత్పాత్ర తతికి నెవడు।
వానికాముష్మికంబున వచ్చుసుఖము॥౬౧॥

కం॥ ధర్మం బొక్కటె మిత్రము।
ధర్మము మరణంబునైన దగ నర్తించుఁ।
ధర్మేతరంబులన్నియు।
నిర్మలమగాతనువుతోడ నిజము నశించుఁ॥

కం॥ ధర పాపపుణ్యముల్ గను।
పరమాత్ముడు నీదుహృదయపంజరమందుఁ।
నిరతంబు నిల్చియుండగ।
నరయగనేనుంటినొకడ ననుటది మేలే॥ ౬౩॥

తే॥గీ॥ అరయ పురుషులచే గృహమందు నిత్య।
మును నిరోధింపబడియుండువనిత లెందు।
రక్షితలుగాను తమయాత్మరక్షణంబు।

చూచుకొనువారెరక్షితల్ సుండుజగతి॥౬౮॥

కం॥ పాప మొనర్చెడివాడిల।
తాపముజెందన్విముక్తి దనరును మరలన్।
పాపంబు జేయనని మది।
బ్రాపింప విరాగియైన బరిశుద్ధుడగున్॥౬౯॥

తే॥గీ॥ పాదపంబులు మృగములు పక్షికులము।
బ్రతుకుచున్నవి కావె యెబ్భంగినైన।
గాని యెప్పుడును మనసున గరిమతోడ।
బ్రహ్మమననంబుచేసెడు బ్రతుకె బ్రతుకు॥

కం॥ తనయునుభవము సుశాస్త్రము।
ననఘుండౌగురువువలన నగునుపదేశం।
బున నెవని కైకకర్మ్యం। [గిన్॥౭౦॥
బుననుండునో వాడెయాత్మమును జూచునో

గీ॥ పుణ్యతీర్థవాసమునను కాయక్లేశ।
మునను నాత్మ దెలియబోలు టెట్లు।
ధర మనోజయంబు దగ గల్గువారికి।
దక్క నోరుల కగునె తలచిచూడ॥ ౭౧॥

తే॥గీ॥ మోహమయమునుడి సడలిన ముదముతోడ।

నాత్మవిదులగుసజ్జను లఖిలసమ్మ।
తముగ నుందురు తత్త్వవ దగును వారు।
గారె సంసారజలనిధి గడపువారు॥ ౬౯॥

గీ॥ ఇతడు బంధుడరయనీతండు గాడని।
దెల్పుచుంద్రు క్షుద్రదీనజనులు।
ధర నుదారచిత్తధర్మచరిత్రులు।
సకలజగము బంధుజనమ యంద్రు॥ ౭౦॥

గీ॥ శూరు డిల గాడు రణమున జేరి గెల్వ।
పండితుడు గాడు విద్యచే భాసిలంగ।
వాక్పటుత్వంబుచేతను వక్త గాడు।
దానతత్పరుడగునంత దాత గాడు॥ ౭౧॥

తే॥గీ॥ శూరు డింద్రియజయమునసూవె; ధర్మ।
చరితమున పండితుండన జనును; సత్య।
వాక్యములుపల్కునాతండు వక్త యగును।
దాతయగునన్ని టనుసమదయనుజూడ॥ ౭౨॥

తే॥గీ॥ అఖిలశాస్త్రంబుల జదువునంత మర్త్య।
డఖిలసుజ్ఞానమున్న వాడగునె దీప।
శిఖప్రకాశంబుచే దెల్పు సేయు నెదుట।

వెనుకచీకటి బాపలే దెనసిచూడ॥ ౭౩॥

తే॥గీ॥ వస్తుతత్వంబు దెలియనివాడు భువిని।
నాస్తికునివలె నుంటయే యగునుచితము।
కాస్తజూచిన గంపంతగంటిననుచు।
వాస్తవముమీరి పల్కునవాడె పశువు॥ ౭౪॥

కం॥ లోకంబుల పుట్టింపను
లోకంబులు వృద్ధిజేయ లోలత లేక।
లోకంబుల గిట్టింపను।
ఆకలనముగల్గు దేవు నభినందింతున్॥ ౭౫॥

కం॥ దేవా మాయపరాధము।
లేవియు దలచిననునిల్వలే మిలలోనన్।
భావించిచూడ సర్వము।
నీవొనరించినట్టిమాయనీరధియొగదా॥ ౭౬॥

కం॥ ఇదిపాపం బిది పుణ్యం।
బిది నరకం బిదియె స్వర్గమీగతివిబుధుల్।
ముదమునను నానతిచ్చిరి।
యదినిక్కముగనకపొందిరఘములనుజనుల్॥

ఉ॥ ఎవ్వఁడు సర్వప్రాణులను।
నేమరకన్ సృజియించె ధీయుఁడై।
ఎవ్వఁడు ప్రాణికోట్ల కిల।
నేర్పడ వృద్ధి దనర్చె శూరుఁడై।
ఎవ్వఁ డనంతసృష్టిని ని।
జేచ్ఛ లయంబొనరించె క్రూరుఁడై।
ఎవ్వఁడనంతుఁ డవ్యయుఁడొ।
యేను నుతింతును వాని వేడుకన్॥ ౭౦॥

తే॥గీ॥ శాశ్వతం బెద్ది? భువి గల్గుసకలమును న।
శాశ్వతంబంచు నందరుజాటగ విని।
విశ్వమనుమాయలో జిక్కి వెతలబడుచు।
శాశ్వతపదవి గన్గొనజాల రకట॥ ౭౧॥

సీ॥ సుగుణసౌందర్యముల్ తగ గల్గుకులసతి।
త్యాగభోగములకు తగినధనము।
సరసమౌకవితకు చాలినవిద్యయు।
మాలిన్యహీనమౌ మానసంబు।
మహిలోన సజ్జనమైత్రియొనర్చుట।
బలము దార్ఢ్యంబునుగలుగునట్టి।

దేహంబునని యొదదివ్యమానసీయోగు।
గానము లేమనుజునిగూడుకొనునా।.
తే॥గీ॥ వానిదే సౌఖ్యపదవి యివ్వసుధలోన
దూరమైనట్టి యేకాంతదుర్గమైన।
స్వర్గ మనశనపథమది. నిర్గమంబు।
దేల కాల్చనా సకల మిందేచెలంగ॥ ౭౦॥

సమాప్తము.

వేదాంత విద్యావిశారద లగు మ. రా.
రా. వులుగుర్త నరసింహాంపంతులుగారి యభిప్రాయ మిట్లువ్రాయుచున్నారు.

ఆ॥ వె॥ పృథుయశో విరాజి బెహారాన్వయుడు రామ।
మూర్తి సుకవి హృద్యముగ సులువుగ।
నజ్ఞులెరుగ బ్రాజ్ఞు లలర బ్రహ్మజ్ఞాన।
దీపిక రచియించె దెలుగుబాస॥

---

